శ్రీరస్తు.

# గురుస్తుతి

అల్లంరాజు లక్ష్మీనారాయణశర్మ

విరచితము.

ఇది

పండితులచేఁ బరిష్కృతమై

విశాఖపట్టణమున

శ్రీ శారదాముకుట ముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడి

ప్రకటింపఁబడెను.

1918.

శ్రీరస్తు.

# ఉపోద్ఘాతము.

శ్రీమదల్లంరాజు లక్ష్మీనారాయణశర్మగారిచే రచింపఁబడిన గురుస్తుతి పరిశీలించితిమి. పద్యములు మిగుల రసవంతములై యున్నవి. ఇందలి కవిత్వము మృదుమధురముగా నున్నదని మా యభిప్రాయము. ఇదివఱకెందఱో కవులు భక్తియుక్తులై తమ యిష్టదేవతలపై శతకంబులు చెప్పిరి. ఆమార్గము నిప్పటివారుగూడ నవలంబించుచునే యున్నారు. కాని తమకు విద్యాదాన మొసఁగిన గురువుగారియం దమితమగు భక్తిని [illegible]సూచకముగా నిట్టి శతకమును వ్రాసి ప్రకటించినవా రిదివఱ కెవ్వరు లేరని మాతలంపు. ఈవిషయమునకు శ్రీ గ్రంథకర్తగారే ప్రప్రథములని మా నిశ్చయము. అజ్ఞానాంధకారము తొలంగునట్లు విద్యగఱపిన గురువుగారియందుఁ గృతజ్ఞత గనఁబఱచుచు నిట్టిగ్రంథములు వ్రాయుట యుత్తమకృత్యము. ఇట్టి వింకను, నాంధ్రభాషలో వెలువడుఁగాకయని కోరుచున్నాము.

ఇట్లు,

గుమ్మా శ్రీరామరాజకవులు.

సీ॥ సత్యంబె నిత్యంబు • స్వాంతంబునం దెంచి
వ్యత్యయంబుల ద్రోసి • వఱలు నెవఁడు
సత్పాత్రదాతృత్వ • మిత్రత్వములు గ్గి
శత్రుహీనుఁడును స • చ్చరితుఁ డెవఁడు
సర్వధర్మంబుల • నిర్వహించుచు నిల
గర్వవిహీనుఁడై • గడచు నెవఁడు
కీర్తి సంపాదక • కేవలకార్యంబు
కోల్పోవు చెల్మియు • కోవసరుఁ డెవఁడు

గీ॥ భావుకుండయ్యు నస్సన • భావమందు
బుత్రివాత్సల్యగరిమ నిం • పొంపగాంచు
నా మహాదేవ విబుధుఁడే • తాత్త్వికుఁడు
సచ్ఛనొసరించె సిద్ధాని • న మహిలోల.

ఇట్లు,
అల్లంరాజు లక్ష్మీనారాయణశర్మ.

శ్రీ ర స్తు.

శ్రీమత్పరమగురవేనమః.

## గురుస్తుతి.

ఉ॥ శ్రీగణనాథు భారతిని
చిత్తమునం దలపోసి యీకృతిన్
బాగొనరింపఁగా మిగులఁ
బ్రార్థన చేయుచు భక్తి, సన్మహా
యోగి! భవత్పదాంబుజము
లుల్లమునందు నుతించెదం, గృపా
భాగమునిల్పి నాయిడెడి
పద్యశతంబును గొమ్ము సద్గురూ॥ 1

క॥ ధర నల్లమరాట్కులమున
మెఱయుచు శ్రీరాజయోగ • మే ఘనమంచున్
దిరముగ బోధలనిడుచు
న్నరఁగవె? శ్రీపేరరాజ • నామమునగురూ?॥ 2

క॥ భువి సద్భక్తులఁ బ్రోవఁగఁ
బ్రవిమల గురుమూర్తివగుచుఁ • బావనధాత్రి

దివిజుఁడవై గొలవోలున
నవతారమ్మెత్తితివిగందా, పరమగురూ? 3

క॥ ఇలలో శంకరుకంటెను
సలలితముగ బుద్ధుకంటె ♦ సరసమ్ముగ నీ
వెలమి నొసంగెడు బోధల
వలనన్నా బాధలెల్లఁ ♦ బాసితివిగురూ!॥ 4

ఉ॥ వాయువుచేత నీరదము
వాసి వియత్పథమెల్ల నిర్మలం
బై యలరారుచందమున
నారయఁ బామరు లుర్విలోన దు
ర్ధీయడఁగించి ముక్తిగని
తృప్తి వహింతురు నీదుబోధచే
నోయి, మహానుభావ! నను
నోరిమితో దరిఁ జేర్పు సద్గురూ!॥ 5

క॥ ఆయాసమయము లందున
యాయాచిహ్నములు గలిగి ♦ యారవికరణిన్
ఆయాసరహితకాంతిని
వ్యాయామము లేక యొసఁగి ♦ భాసిలవె? గురూ!6

ఉ॥ వందనమయ్య నీకు బుధ
వందితగాత్ర! జోహారు యోగరా
డ్వందితపాదపద్మయుగ!
వందనమియ్యదె, సత్యవార్ధ్ర్శ్రీ

నందితశిష్యబృంద! యిల
నాకీక వేఱొక దిక్కు లేద! యా
నందముఁ జెంద నీకృపను,
నాకిడ వే? తడవేల? సద్గురూ॥ 7

క॥ పేరునను యోగమున నీ
వారయ నందందురాజ • వయి బోధలచే
నీరజనయనుని ఘనవే
ణూరవసమసుఖము మాకు • నొసఁగవె? సుగురూ!8॥

క॥ నమ్మని వారలఁ జూడవు
నమ్మిన హితబోధచేత • నయము దలిర్పన్
రమ్మని రమ్యంబౌ భా
వమ్మిడుదువు నీకుసాటి • వారేరి? గురూ॥ 9

శా॥ సంగీతంబునఁ బెద్దవంచు నిలలో
జాటంగ లేదో, ఘనుల్
అంగీకారమునన్ సుయోగివని
యత్యంతమ్ము శ్లాఘింపరో,
శృంగారంబుగఁ జుట్టు ముట్టు నల నీ
భృత్యాళికెల్లన్ భవ
త్సంగానంద మొసంగ లేదొ కృపచే,
స్వామీ! మహాసద్గురూ॥ 10

క॥ చూడఁగను బీదవనహా!
నాకలంబు నొసఁగు • వేల్పవు తండ్రీ!

జాడలను దెల్పి కరుణదయ
నోడకుమని చేరఁదీయు హాయనఁగ గురూ॥ 11

శా॥ బాధల్ చాలఁగఁ జెందు నాదుమన మీ-
బంధంబుల న్వీడఁగా
బోధల్ పెక్కులొనర్చుచున్ సుఖములన్
బొందింప లేదో మదీ-
యాధివ్యాధుల నెల్లఁ ద్రోసి, నిజశి-
ష్యానందసంధాన, నీ
గాధల్ ధాతకునైన నెన్నదరమే!
కాపాడవే? సద్గురూ॥ 12

శా॥ ఆధివ్యాధులడంచి ప్రోచితివి నా
యాలి న్సగర్భ బుత్రికన్
గాధల్ లేవిఁకఁ గామ్యముల్ సడలెను
గార్హ్యంబు హెచ్చె న్గడున్
సాధూత్తంసమ! త్వత్ప్రసాదమహిమన్
సౌఖ్యంబులం జెందితిన్
బోధానందమయా! యనంతమహిమా!
ప్రోవంగదే? సద్గురూ॥ 13

క॥ సురలన్, రాజుల, వేడిన
వరమీయర! యిత్తురేని • బహ్వల్పము, నీ
వరుదుగఁ గోరిన నొసఁగెదు
పరమితి లేనట్టి పదవి • పరమేశ! గురూ! 14

క॥ వేషము భాషయు నెలమిన్
భూషణములు చిత్రగతుల • బోధామృతమున్
భేషనఁగాఁ దగు గాత్రపు
ఘోషము నీకబ్బె, నిజము,• గుణగణ్యా! గురూ!॥15

ఉ॥ పూర్వమునందు శంకరుఁడు,
బొందెను మానుష దేహ మప్పుడా
పూర్వులు వారియందుఁగల
పూజ్యత నెంచఁగ లేక పోయిరే?
పూర్వమునందు మేమయినఁ
బూజలఁ జేయుదు మందు రిప్పుడీ
యోర్వఁగలేని పామరులు,
యోగి! నినుస్గన లేక సద్గురూ!॥ 16

చ॥ బలులయి రక్కసుల్ సురల
వంచన సేయఁగ నిన్ను వేఁడినన్
వలదిఁకఁ బోరటంచు బలు
బాసలు బల్కి సుధ న్గడింపఁగా
వలనగు మార్గమున్వెదకి
బాగుగ నీవు సురాళిఁ దన్పుచున్
వెలఁదిగమాఱి, మాయవగ
పెంపునవారలఁ గూల్పవే, గురూ!॥ 17

చ॥ ఇల మము రాక్షసాళివలె
నెంతయు బాధలొనర్చు చుండుగా

బలియగు నీమహాప్రకృతి
　　బాగుగ దాని నడంచి నీకృపా
బలము నొసంగి ప్రోచితివి
　　భాసుర! నీవిపుడీనరాకృతిన్
వలనుగఁ బొంది భక్తులకు
　　వాంఛలిడం దగదోయి! సద్గురూ॥ 18

క॥ ప్రకృతికి బ్రహ్మ స్త్రింబవు
వికృతికి నెన్నంగ వేద • వేద్యుఁడవనఘా
సుకృతికి బోధకతంసుఁడ
వకృతుల కాధారమూర్తి • వఖిలేశ! గురూ!॥ 19

శా॥ ఏసారాంశము చూడ లేదు మహిలో
　　నెన్నంగ లేదింతయున్
దాసానందునిఁ గొల్వ లేదు మఱి నీ
　　తా వెన్నఁగా లేదు, నే
నీ సంసారపు నూతిలో మునిఁగి యెం
　　తే బాధలన్ బొందితిన్
వే సాయంబు నొనర్చి చేర్పుదరి న
　　న్నేఁడట్టున్ సదాసద్గురూ!॥ 20

మ॥ నిదురందున్ దగఁ దెల్వియందు మఱి నీ
　　నేస్తంబె కాంక్షించి ని
న్నదలోఁ జేరిచి నమ్మినాఁడ నిఁక నే
　　నెవ్వానిని నేఁడ నో

సదయాంతఃకరణుండ! సత్కృపను న
న్సంతుష్టునిం జేసి నా
హృదయంబందు వసించియుండఁ గదవే
హృత్కృష్ణవాయన్గురూ॥ 21

శా॥ నాశక్తిన్ దగ నిన్నుఁ జూచితి నహో
నాతండ్రి నీవెప్పుడున్
ఈశత్వంబున భక్తకోటి నిలలో
నింపొందఁగాఁ జేయుచున్
నాశంబొందక తేజరిల్లఁగను నా
నాక్లేశముల్ వాయఁగా
పాశంబుల్ దెగఁగోసి ప్రోవఁగదవే!
పాలింపవే! సద్గురూ॥ 22

ఉ॥ అన్నయుఁ దల్లిదండ్రులు ని
జాప్తులును న్మతి బాంధవాళియున్
గ్రన్నన నీవె నాకయితి
కాంక్షయొకించుక లేక యెప్పుడున్
వెన్నుఁడ! నేస్తకాఁడ! నిను
వేమఱు నాహృదయాంతరంబునం
దెన్నుచు సేవచేసెదను
దీనుని నన్గృపఁజూడు సద్గురూ॥ 23

క॥ పరధనతరుణీవాంఛలు
పరఁగంగను జన్నినాఁడె • పాపితి వనఘా!

కరపవె! జ్ఞానానందము
కరిఁబో్రిచిన కమలనాభు • కరణిన్ సుగురూ! 24

ఉ॥ పావననామ! యోగికుల
పాలక! సద్గురుమూర్తి వందితా!
తావకబోధనామృతము
దాఁగొన నెట్టిమహానికృష్టుఁడున్
సేవిత విష్ణుపాదుఁడయి
శీఘ్రమె సౌఖ్యము లందుచుండు సం
భావితుఁడై సుమూర్తి నెడఁ
బాయఁ డెదన్ గడుచిత్రమౌగురూ! 25

శా॥ వృక్షంబుల్ ధనధాన్యముల్ వనములున్
వేదంబులున్ గోవులున్
బక్షుల్ భూములు మానవుల్ దివిజులున్
ప్రాణంబులున్ బాటయున్,
నక్షత్రంబులు చంద్రసూర్యులును భూ
నాథుండు సర్వేశుఁడున్
దక్షత్వంబున నీవయుంచనవె వే
దంబుల్ సదా సద్గురూ! 26

చ॥ కరమునఁ గృష్ణగానచిటుకల్
ఘటియించియుఁ దంబురాశ్రితిన్
అరుదగు ముద్దుమ్రొక్కటము
నంబకృపాసదుపాయవృత్తియున్

నిరతము గోపబాలకుని
నెమ్మిమనమ్మున నమ్మిపాడుటల్,
సరసమెలర్ప దేవముని
చందముతై తనరారు సద్గురూ॥ 27

శా॥ సంసారంబను సర్పరాజము నరుల్
సందష్టునింజేయఁగా
కంసారిం దగఁ బాడుచుండుట యమో
ఘంబైన మంత్రింబుగా
హంసాచ్ఛాదన కృష్ణగానచటుకా
హ్వానమ్ములన్ జేయుచున్
ధ్వంసాపాదవిషంబు పాపెదవుగా
దక్షుండవై సద్గురూ॥ 28

చ॥ భవమును దోలు సత్కృపల
భాగ్యముకీలు మహాకటాక్షముల్
నవనవదేలు సత్కృతులు
నాయకుబోలు సురూపసంపదల్
బవనుని బోలు యోచనలు
పావనమేలు సుహృత్ప్రసారముల్
దివమును దోలు దేజములు
దేవరపాలుగదా సదాగురూ॥ 92

చ॥ యతియున మెట్టిదో తెలియ
దయ్య! గణంబులు బ్రాసలన్న నా

వెత మిసుమంత నేనెఱుఁగ
వేదము సంస్కృత మాంధ్రమున్ గతా
గతముల స్వప్న తుల్యములు
గాని సమంచిత యోజనుండవై
సతతము నిన్ను గొల్చుటలె
సర్వము నాకిఁక శ్రీజగద్గురూ॥ 30

చ॥ ఎంతయు సొంపనన్ భ్రమల
నింపి నిజంబగు ముక్తిమార్గమున్
బంతిల దాని బోకడచి
భావమునన్ దలపోయ భూతనై
వంతలబెట్టు నీప్రకృతి
బంధములన్ దెగఁగోసి ప్రోవవే
వింతగ నీదుదాసునను
వేడ్కఁ జెలంగఁగ శ్రీజగద్గురూ॥ 31

క॥ నీనామము నీమముతో
దానాడిన దుఃఖచయము ♦ దా నడఁగు నిలన్
బోనాడుదు వల మాయను
నీనాయను భేదబుద్ధి ♦ నిలపవుగ! గురూ॥ 32

ఉ॥ పట్టగరానివాడ వని
బండితులెల్ల వచించుచుండగా
దిట్టరినైనవాని కది
చెల్లమటఁచును బల్కనాఁడ వా

గట్టితనంపు ద్రోవలను
గట్టిగ నిన్ నుతియింతు దెల్పు నా
కిట్టులటంచు దాసుడను
వేగమె దీనపరా, జగద్గురూ॥ 33

ఉ॥ భక్తుని ప్రాపు యార్యజన
భావనుదిపు సురాజయోగ సం
సక్తునకింపు దాసునెడ
సత్వము నింపు మహోఘజాలపుం
వ్యక్తికి దెంపు బామరుల
భారము దింపు మహానుభావులక్
ముక్తికి బంపు నీతనుపు
మోదపు నీడగు చూపు సద్గురూ॥ 34

క॥ వచ్చెనిఁకఁ గలియుగంబని
చెచ్చెర ప్రళయంబు లేక • జీకాకుదగన్
బుచ్చన్ వెలసితి విటులన్
మెచ్చన్ బండితులు మిగుల • మేదిని సుగురూ॥35

చ॥ అరయగ వేశ్యకాంత ధన
మాదిగ నెంచి విటున్ గడించు న
ట్లరుదుగ మాయలన్ మెలగి
యాసలఁ దా గురుమూర్తియందు, మై
నిరకుగ నుంచి బొందుఁడిఁక
నీతిని ముక్తిసుఖంబులంచు బల్

దిరముగ వేదముల్ వలుక
దీన నినున్ మది నమ్మితిన్ గురూ। 36

క॥ ప్రకృతినడంపన్ మార్గము
సుకృతియె యని యీవు ముద్దు • సుద్దులువలుకన్
వికృతిన్ గోరుచు నరులు పు
రాకృతి వీడంగ లేరు • రమ్యముగగురూ। 37

చ॥ జలములయందు పద్మముల
జాయగనంగనె బోయిబాలకుల్
జలములయందు జొచ్చుక్రియ
జాలగభోగములన్ మరంగి యా
జలములబోలు మాయవగ
జక్కగమున్ని నిను న్దలంప రో
జలజహృదాంతరాళ! నను
జాలిమెయిన్ కృపనేలవే? గురూ। 38

క॥ మృత్యుంజయుఁ డత్యుగ్రత
మృత్యువు దానడచి వేడ్క • మేదిని మనినన్
అత్యుత్తమాంశలీలల
వ్యత్యస్తము లేక బ్రకృతి • వధ గొనవె గురూ। 39

క॥ తమము గలిగి నినుదూరిన
తమవారలటంచు నెదను • తలపవె? నీ పు
త్త్రముఁడ, తమోహర! వారలు
భ్రమ విడి నిను గొల్వలేదా • బాగుగనుగురూ। 40

ఉ॥ ఎందరో నీచమానవుల
దేర్పడరాతిని దైవమంచు బల్
వందన మాచరించెదరు
వహ్వారె! యేమిది బల్కుసిగ్గులో
పొందుగ మాటలాడుచును
పున్నము లెచ్చెడి నిన్నుగాన నో
సుందరగాత్రి! దానుఁడను
చోద్యమెలర్పఁగఁ బ్రోవు సద్గురూ॥ 41

ఉ॥ అంతయు నీవెయంచు గడు
నాసలఁజెందెడి నన్ను మాయ బల్
వంతలఁబెట్ట నెంచెడిని
వహ్వారె! దానిజయింపనోప నీ
వింతలనెల్ల మాన్పి నను
వేమరు నీకృపనేలు నిన్నునే
మంతన మొప్ప నమ్మితిని
మాన్యుఁడ! దానవరా! జగద్గురూ!॥ 42

క॥ నీధ్యానమె యాహారము
నీధ్యానమె రక్తికరము • నిజదాసులకున్
నీధ్యానమె సౌఖ్యంబిడు
నీధ్యానమె ముక్తికరము • నిధులును సుగురూ॥ 43

క॥ రామయన దుర్గ్లనఘుమని
వేమరు వేదంబు వలుక • వింతగ కుజనుల్

రామను సేవించితిమిఁక
భ్రామికములు లేవటంచు ♦ బలికెదరుగురూ॥ 44

క॥ కబ్బంబులు జూచితిఁ గడు
నిబ్బర మిసుమంత లేదు ♦ నీతు లెఱుంగన్
దబ్బర లెఱుఁగను సత్య
మ్ముబ్బితి రక్షింతువనెడి ♦ యూహనుసుగురూ॥ 45

మ॥ కో॥ భారమెల్ల నడంచినాదగు
భావమందు వసింపుచున్
ఘోరమౌ భవబంధసంఘము
గూల్చి వేగమె నన్ను నిం
పారఁజూచియు నీనుసత్కృప
పాత్రుఁజేయవె దాసుఁడన్
దారిఁజూపగ లేరు నాకిల
దాతలెవ్వరు సద్గురూ॥ 46

మ॥ కో॥ పేరరాజను రూపమొందియు
ప్రేమభక్తులఁ గాచెదో
వేరు నీసరి వారలెచ్చట
లేరు లేరని జాటఁగన్
సూరిసంఘము నిన్ను వేఁడుక
జూచుచుందురు రెప్పుడున్
పరిశక్యము నిన్ను నెన్నఁగ
నిమ్మహిన్ సదయా గురూ॥ 47

మ॥ కో॥ రాముఁడో యల సోముఁడో యన
రమ్యతం గడుచల్లనన్
భీముఁడో యల ధాముఁడో యన
భీకరత్వము ధీరతన్
కాముఁడో యల దేవుఁడో యన
కామమున్ దగుశక్తియున్
నీమె మొప్పఁగ నీకుఁగల్గెను
నిక్కమయ్య జగద్గురూ॥ 48.

ఉ॥ రాముఁడ వీవ యంచనఁగ
రాదు దలంప మహానుభావ! నిన్
సోముఁడటంచు బల్కితిని
శోభవహింపద యయ్యెదింక బల్
భీముఁడటంచు నాడితిని
బేలతనంబది గూడ నయ్యెనో
భామను వీడుటఁ గళల
వాడుట గర్వము నొందుటన్ గురూ॥ 49

క॥ పుట్టితివి గట్టు జేర్పఁగ
దిట్టరివై మాయతలపు • దీయుచు నిలలో
నెట్టి నినున్ దూరెడి యా
కట్టన్ గట్టున్ యముండు • కాదనక గురూ॥ 50

క॥ నిజముగ నిన్నదె నమ్మితి
నిజమనునది నిజము నిజము • నిజముగ నిజమే

భజిరంజన సుజనాంజన
విజయుగ నన్ జేయుమయ్యా • వేగమె నుగురూ॥ 51

ఉ॥ నీదయ గోరుదాసునకు
నీమము లేల? ధనంబు లేల? యా
వేదము లేల? లంచమును
బీదతనంబున నేల? శాస్త్రపుం
వాదము లేల నిశ్చలత
భావమునందున సర్వమీవుగా
కాదని దానిబోకడచి
గాంచవలెన్ పతమున్ జగద్గురూ॥ 52

క॥ ప్రియదమ్మను సుధ నాహృద
యమునందిడి నీదుదాను • నాలింపవె నీ
సముచితహృదయాబ్జమధుర
సముకై యుల్లిదపము చేతు • సాకవె? సుగురూ॥ 53

క॥ నీవాశ్రిత లేఖనందియు
నావాశ్రితదవర్చ్చనట్టి • యంశము లెల్లన్
నీవాశ్రిలు పతకు గాంచుదు
నేవాశ్రితయోగావి యమృతము దెదివి సుగురూ॥ 54

క॥ ఇదిగాదిల నిదిగాదని
మది నెన్నుచు పర్వమీవె • మహానీయుయనవ్
విదులై కోవిదులై ఘుత
ముదమున నిన్ జెందెదరుగ • ముక్తి వరగురూ॥ 55

ఉ॥ పున్నెములన్న సౌఖ్యపుఁ
భోగములన్న మరంగె దెప్పుడున్
భిన్నములన్న భావమున
వెల్గుచునుండును నీకథాచయం
బన్నెనొ? సిద్ధుగల్ వాడము
నయ్యెయొ? నిన్నది నమ్మితంచు నా
పన్నతగోల చేసితి న
దెట్టులు గాతువొ? నన్ను సద్గురూ॥ 56

శా॥ ఎందుంజూచిన రాజవంచు భువిలో
నే నెంచి నిర్వేదఁగా
బొందంజాలవు జాలినించుకయు నీ
బుత్రుండఁగానా? నినున్
బొందంగోరితి బ్రోవుమా? యటులు నా
ప్రార్థ్యంబుం ద్రుంచి వే
సందుం జూపఁగరావె నీవె[illegible]తి నా
సామీ సదా సద్గురూ॥ 57

శా॥ జ్ఞాతుండన్ భవదీయసేవకుఁడ నీ
సంబంధుఁడన్ బంధుఁడన్
నీతుల్ గోరెడి వాఁడ నీసుతుఁడఁ
గా నే సత్కృపం జిక్క సం
ప్రీతిన్ జ్ఞానగుణప్రసారమది
దీపింపంగ బోధింపవే

కాతర్యంబును బాపవే తెలుపవే
కాపాడవే సద్గురూ॥ 58

క॥ నమ్మినవానిని బొమ్మన
నిమ్మహిజనులెల్ల నిన్ను • హేళింతు రయో
కమ్మని సుచరిత్రుఁడనన్
పొమ్మనవిఁక ధైర్యమబ్బె • పుణ్యాత్మ గురూ॥ 59

మ॥ తొలిజన్మంబున నేమిసల్పితిమహో
తుచ్ఛాత్ములై మిక్కిలిన్
వెలియై యొప్పెడి పాపరాశిని మమున్
వే నీకృపన్ బ్రోచితో
మలిజన్మంబున బ్రహ్మమొందుఁ డనుచున్
మాతండ్రి నీవెప్పుడున్
దలపందుండి కటాక్ష మీ విడగదే
దాసావనా సద్గురూ॥ 60

మ॥ ఘనసాంసారికవృత్తుల న్గడువగా
గాంక్షింప మున్జేసితో
మనమెప్పన్ గురునామకీర్తనముచే
మాయన్దగన్ బాయుచున్
దినముల్ జేయఁగనెంచి ప్రోచి తిప్పుడో
దీనావనా యుల్లనీ
వనయంబున్ గృపనెన్న బాధ్యుఁడవహో
యార్యా? సదాసద్గురూ॥ 61

ఉ॥ పెద్దలగూడ బుద్ధి నిరు
పేదలఁజూడఁ గృపారసంబు లే
దద్దిర గొప్పవారిఁగన
నాత్మను సంతసమందలేను, నా
కెద్దిర సద్గుణంబు నిజ
మెన్ని ననున్ గడజేర్పవేమొ, నా
బుద్దిని నమ్మియుంటి సుమ
కోపము మానవె? పోవవే? గురూ॥ 62

క॥ నిన్నె న్నెద నామదిలో
మన్ననమెయి దైవమంచు ♦ మాన్యుఁడ! ననునీ
కన్నకుమారువిధంబున
మన్నింపవె దాసపక్ష ♦ మహనీయ! గురూ॥ 63

క॥ ఈకలి జను లెల్లప్పుడు
నాకలిగొని త్వరితగతిని ♦ హాయనివేడన్
ఆకలిని దున్మించికావవె
భీకరతరమూర్తివయ్యు ♦ భేషనగగురూ॥ 64

ఉ॥ ఆరయపింగళాఖ్యఁదన
రారెడు వత్సరమందు దివ్యమా
ధీరతవ్యాసపౌర్ణమిని
దేవరకారణ మిచ్చి పోవవే
సూరిజనాబ్జభృంగ ఘన
శోభనమూర్తి కృపారసోక్తి నిం

పారఁగఁజూడ వేడెదను
బాలనసేయు వె? నమ్మితిన్ గురూ॥ 65

శా॥ ఆనందాంకితమైన మోము సుమన
స్సంధానుఁడో రాముసాం
ద్రానందంబున భేదముల్దెలగు
చత్యంతమ్ము పాడంగ నీ
వానందాంశిత రేఖనొప్ప భవదీ
యంబైన యుద్యత్కృపా
దానంబిచ్చియు బోధించుచుండెదవుగా
దానావనా సద్గురూ॥ 66

మ॥ శ్రీమలన్ బాపి యమోఘమున్ ఘనమునౌ
సామ్రాజ్యమీ లేదో యో
సుమనఃకాయః! మహానుభావ! గురురాట్
సోమా! సదానందమా!
విమలాంతఃకరణా! సుధీజననుతా!
వేదాంత వేద్యా! సుహృ
త్తమ! విద్యాధిక! దేవ నీను కృపచే
దాపంబు లారున్గురూ॥ 67

భ॥ తాఁటినిజూచి సర్పమని
తల్లడమందెడి భామరుఁబలెన్
ఏటికి భ్రాంతి జెందెదరు
యీదఁగరాని మహాప్రవృత్తు లీ

పాటికిఁ గట్టిపెట్టి గురు
పాదరజోసుఖ మందుఁడంచు బల్
ధాటిగబల్కి బోధలిడి
ధర్మములన్ దయచేయవేగురూ॥ 68

క॥ ఇహతరణమ్మొ ఱుఁగక నేఁ
దహతహ గొనుచుంటజూచి ♦ తండ్రివలె నీ
వహహా! మహాదేవ మహా
మహిమను నాకొసఁగి వెతలు♦మాన్పవె?సుగురూ॥

క॥ మహిని మహాదేవా! నా
కిహసౌఖ్యము లెల్లగల్గె ♦ నేమీపుణ్యం
బహహా నారాయణ? గురు
మహిమసుమా?మరువమాను♦మా?యనవె?గురూ॥

ఉ॥ తానిలఁ జేయు గర్మములు
దప్పక యెప్పటికైన భుక్తముల్
గానివె పాయజాలవని
గారికలెల్ల నెరుంగఁ జేయఁగా
నానని బండితుల్వలుక
నయ్యది యోర్వక నిన్ను వేడఁగా
బోనివిపోవ నేసి తగ
బుద్ధుల భూమిక లీయవే? గురూ॥ 71

ఉ॥ అప్పుడు నీవు పెద్దపురి
యందున నాదగు భక్తినెన్నుచున్

దప్పుల నెల్ల ద్రోసితగ
దాసుని వీనిగ్రుపన్ గసన్ వలెఁ
దప్పకయంచు నెంచి కడు
తాలిమి నీవరుదెంచి ప్రోవవే
యెప్పటికైన నీమహిమ
నెన్న ధరందరమా నె? సద్గురూ। 72

ఉ। చిన్నతనంబునందు పితృ
ప్రేమను దాసు కుమారుజూచి నా
కన్నకుమార? యిట్లనిన
కమ్మనిక్షీరమొసంగు దంచు బల్
మన్నికతోడ బిల్చి పలు
మాటలజెప్పియు పాలనీయఁడే
యన్నయ మెప్ప బోధలిడి
యయ్యమృతంబిడవే జగద్గురూ॥ 73

చ। మధురము జూచి బాలకులు
మంచిదటంచు భుజించి రోగులై
వ్యధగొన తల్లి కారమిడి
బాధలడంచిన రీతి నన్నువే
వృధయగు నీమహాప్రకృతి
బాపియు నీదగు బోధనాసుధా
కధలిడి కావవే? సుజన
కామితదాయక! శ్రీజగద్గురూ। 74

ఉ॥ చిన్నలకెల్లఁ జిన్నవయి
శ్రేష్ఠులకెల్ల గడింది పెద్దవై
సన్నుతయోగివర్యులకు
చాలగ రాజవు నయ్యుఁ బ్రేమనా
పన్నులకెల్లఁ దండ్రివయి
పామరులన్ దరి జేర్పనోడవై
కన్నన వేడ తాతవయి
కాచుచునుంటివి గాదె సద్గురూ॥ 75

ఉ॥ బోధల నోడు దేనియలు
బుద్ధులనోడు కృపారసత్వమున్
మాధవునోడు సత్కృతులు
మంచిగబాడు మహానుభావముల్
శ్రీధరుఁడాడు సత్కథలు
ఛిద్రములూడు కృపాపరిసారముల్
బోధలనూడు నీప్రకృతి
భూమిక లేదు నిజంబు సద్గురూ॥ 76

చ॥ ఎన్నఁడొ తుచ్ఛకార్యముల
నేరక చేయుట యిట్టిరూపమై
కన్నన బాధ హెచ్చెడిని
కావగ లేదిల నాకు నిక్కమా
పన్నత నున్నవాఁడ నను
బాలన చేయఁగ దిక్కు నీవె న

న్నన్నక యొప్పుమైదలచి
యేలుమయా? సుదయామయా గురూ॥ 77

క॥ అని నిన్ మదిదలపఁగ నన్
ఘనమగు వ్రణబాధనుండి • గడపియు నాదా
మనమందు నిడవె? వేడ్కను
దినదినమును వృద్ధిబొంద • ధీరాత్మ! గురూ॥ 78

క॥ ఏమిది బాధరవంతయు
లేమికి దగుకారణంబు • లేదిదివింతే
సామిని దలచితివీనిని
సేమమడిగి వెడలె నింతి • జాలము నుగురూ॥ 79

క॥ అంతట నామరునాటనె
సుంతయినను కారణంబు • జూపక జితికెన్
వింతం జెంగలవారలు
సంతసపడి గురుకృపార • సమనిరినుగురూ॥ 80

క॥ ఈసంసారపు తమమున
నేసందును గానలేక • యీజనులెల్లన్
దోసంబు లొందగని యా
వేసంబులు మాన్పివేడ్క • వెల్గిడవె? గురూ॥ 81

చ॥ అజ యతిసత్వబుద్ధి మెయి
నాడుచుఁ దా తృణమున్ భుజించుచున్
నిజమగు భూస్థలిన్ వదలి
నేరక నూతను మున్గునట్టుగా

నజనుత! సౌఖ్యము ల్గొనెడి
యాసను నీపరిక్రితిన్ మునుంగగా
విజయుగఁ జేసి వ్యాధులను
వేడ్కను మాన్పవె? శ్రీజగద్గురూ॥ 82

చ॥ అడవులయందు మౌనివరు
ల్లాకులు మేయుచు నీదుసత్కృపన్
బడయఁగ వేచియుండ భవ
బంధములన్ దెగఁగోసి ప్రోచితో
నడుపడి హీనుడై జడుఁడు
నర్మిలి నిన్దరి జేర వేడఁగా
నడవుల నేమికద్దనుచు
నాదరణం బిడ వే? జగద్గురూ॥ 83

ఉ॥ అందఱు నీవె సర్వమని
యాధిదొలంగియు వారిశక్తులన్
బొందుగ నీకొసంగి కడు
బూజలఁ జేయఁగ నే నశక్తి చే
గుందుచునుంట యీవుగని
కీఱ్ఱడనం చెద నెంచి యాకృతిన్
బొందుగఁ జేయు శక్తి నిడి
బోధ నొసంగ వె? శ్రీజగద్గురూ॥ 84

క॥ గురురూపంబయి గుఱినిడి
సురుచిర రూపమ్ము నెంది • సుఖముల నిడి బల్

సరసత బోధలనిడి భూ
సురుఁడన ధరదేజరిల్లు • చుంటివి సుగురూ॥ 85

మ॥ కో॥ నాడుకృష్ణుఁడు శిధిలచేలుని
నమ్మఁబోచిన రీతిగన్
వీఁడు భక్తుడటంచు సర్వము
వేడ్కనిచ్చియుఁ గావవే
లేఁడు నీసరివాఁడు జూడగ
లీలలందు నిజంబుగన్
తోడునీడయు నీవె నాకిఁకఁ
దోవజూపవె? సద్గురూ॥ 86

ఉ॥ ఏమిది యీవె సర్వమని
యెల్లరు బల్కఁగ వేడినందుకే
రామియు లేదు పైని గదు
రాయిడి బెట్టితివౌర దేవ ని
న్నేమన నేమి వచ్చెడిని
నేలకో నిన్నది నమ్మినాఁడనో
సామిగబోవరావె యిఁక
జాలము సేయగ నేలసద్గురూ॥ 87

ఉ॥ చాలగ శిష్యులబ్బిరని
జాలము సేసెదో వీనిఁబోవగా
నేలని యెంచినావో కన
సామెతలాయెడిఁ జాలుఁజూలు నీ

పాలనఁజూడఁ జిత్రిమిల
పామరు సన్ దరిజేర్పవేలొకో
కాలము వ్యర్థమాయెడిని,
కావనిచో నిను నీభువిన్ దివిన్
చాలగహీనుడంచు దగఁ
జాటెద సుమ్మ నిశమ్ము సద్గురూ॥ 88

క॥ ఏమీగురువర! నినో
సామీయని జాలబిలువ ♦ చలమెంచెదవా
కామాతురుని విధంబున
వేమారు దలంచుచుంటి ♦ వే ప్రోవుగురూ॥ 89

క॥ శిలలోని ప్రాణి మనిచెడు
నలనేతవె? నీవుగాన ♦ యహరహము న్నే
నిలసంసారాటవిలోఁ
దలపోయుచు నుందు ముక్తి ♦ దాయకసుగురూ॥90

క॥ వెట్టివిధంబు నిడు నా
మొట్టలవిని కావవేర ♦ మోహనరూపా!
యెట్టని జూడ్కులఁ జూడక
కుట్టఁడ ననుబ్రోవుమయ్య ♦ గుణగణ్యాగురూ॥ 91

ఉ॥ నిద్దురయందు జాగ్రితను
నీమములందు సుఖంబులందు నే
ప్రొద్దును నీదు సత్కృపను
బొందెడి నిక్కపు నిశ్చలత్వమే!

యద్దిర యీాయవేమి నిను
యాచనఁజేసితి, లేనివాఁడవా
ముద్దులమోామువాడ! యిఁక
మోాదము నింపవె వేగ, సద్గురూ॥ 92

క॥ ఏలా నన్నిటు విడిచితి
వేలాజాలంబదేల • వేలాలీలా
మాలాధారుడ నన్నిల
మేలాశల నిన్నువేడ • మేలిడవెగురూ॥ 93

ఉ॥ కింకరులన్న రారు దరి
కేశవుడన్న సదాథరించు బల్
బింకముతోడ బ్రహ్మమును
భేషసనొందు నదొక్క వేళలన్
జంకని సంతసంబాదవు
జాలగ బాపచయంబులోడు ని
శ్శంకత జాఱు శంక లిలఁ
జక్కని నీకృపగల్గువానికిన్
వంకలులేక యిట్టిఘన
భాగ్యములబ్బెడి శ్రీగజద్గురూ॥ 94

క॥ గురువరు కరుణను సరసగ
మరగిన నరుడమరు కరణి • మఱి మఱి యలరున్
ఖరనని ధీరత ధీవరు
లరయుదు రనిశమ్మునిన్ను • నార్యా! సుగురూ॥95

ఉ॥ సారము కింత లేదు గన
జక్కఁగఁ గన్పడుచుండునయ్య సం
సారపువ్యూహమున్ గెలువ
జాలక నీపదపద్మయుగ్మ మిం
పార భజించుచుంటి నను
బాలనచేయర పాపపంక్తికిన్
దూరుడ నాదుదోసముల
ద్రోయుమయా కరుణామయా గురూ॥ 96

శా॥ ఈరాజ్యంబులు భోగముల్ గృహచయం
బింపార దారాదులున్
పారావారము లీనిధుల్ వనములున్
బానీయముల్ సీమముల్
సారాంశంబులు వేదముల్ స్మృతులు సం
సారైకసౌఖ్యంబులున్
తారాదుల్ సకలంబు నీదుకృపకున్
తారసందుఁ దగ్గున్ గురూ॥ 97

క॥ ఈపుట్టుట లీజచ్చుట
లీపదవులు జంతుకోటు • లీభువనచయం
బీపవనుఁడాది సర్వము
నేపగు నీయిచ్ఛగాదె • యీశాన! గురూ॥ 98

## శ్రీసద్గురువృత్తములు

ఓంకారార్చిత ఓం శ్రీం సుగురోమ్
సృష్టిస్థితిలయకారణ సుగురోమ్
నిరావలంబ సుఖాస్పద సుగురోమ్
స్థూలసూక్ష్మకారణ హర సుగురోమ్॥ 99

ఆధివ్యాధిభయ హరణ సుగురోమ్
అరిషడ్వర్గ వినాశన సుగురోమ్
అశేషజీవాంతరపర సుగురోమ్
అణువాది మహత్పర్యంత గురోమ్॥ 100

సతతానంద ప్రదాయక సుగురోమ్
సకల భూత సంరక్షిత సుగురోమ్
సర్వవేద సంభావిత సుగురోమ్
సర్వశుభద మంగళమిదె సుగురోమ్॥ 101

కారణకార్యా ధారక సుగురోమ్
కపటనాటకా వేశిత సుగురోమ్
కరుణాసార సువృష్టిద సుగురోమ్
కృష్ణగాన చిటికాధర సుగురోమ్॥ 102

త్రిగుణాతీత పరాత్పర సుగురోమ్
తుర్యాతీత సదాస్థిత సుగురోమ్
తమోవిభేదక సద్గుణ! సుగురోమ్
దాసాంతర్గతవాసిత సుగురోమ్॥ 103

బ్రహ్మవిష్ణు రుద్రాత్మక సుగురోమ్
బగళోపాసక బలయుత సుగురోమ్
బోధనామృతా దాయక సుగురోమ్
భవభయవనదావానల! సుగురోమ్॥ 104

మహాదేవోపాధిదము త్సుగురోమ్
మత్కుటుంబ కారణదాయ గురోమ్
మమపాపౌఘ వినాశక సుగురోమ్
మామక మహనీయాత్మక సుగురోమ్॥ 105

నందనందనా మోదితసుగురోమ్
నాదబిందు కళనాయక సుగురోమ్
నిఖిలధర్మ సంపాదిత సుగురోమ్
నిర్వికల్పసంభూతా సుగురోమ్॥ 106

ఉ॥ శీతులగోత్రముల్గలిగి
నేర్పున జగ్గయ వెంకమాంబకున్
పాకటలీల బుట్టి ధరఁ
బ్రాభవ సద్గురుమూర్తి సత్కృపా
శీకర వేడుచుంటి నను
జేరఁగఁ దీయవె! యాదిమూర్తి నీ
వో కమనీయగాత్ర భర
మోపగజాలను బ్రోవుసద్గురూ॥ 107

చ॥ తెలియనివాడనం చొరులు
దిట్టెద రేమొ యటన్న భావమున్

బలిమినిదోఁచి నీకృపయె
బాగొనరించు నటంచునెంచి యీ
విలసితభక్తి గ్రంథమును
వేడ్కను జెప్పితి భక్తుఁడన్ భవత్
కులజుఁడగాన దీనిఁగొను
కోరికదీర దయామయాగురూ॥ 108

ఉ॥ మంగళమయ్యనీకు శుభ
మంగళమయ్య మహానుభావ జే
మంగళమయ్య దాసజన
మాన్యుడ మంగళదాయకంబు నా
మంగళహారతిన్ గొని సు
మంగళదాయక నన్ను బ్రోచి స
న్మంగళకైతకన్నియను
మానక కైకొను శ్రీజగద్గురూ॥ 109

క॥ నను లక్ష్మీనారాయణ
యని గడువాత్సల్యమొసఁగి • యందురు సుజనుల్
ఘనమగు నీపదపద్మము
లనుదినమును గొలుచువాఁడ • నార్యాసుగురూ॥

ఇట్లు,
అల్లంరాజు లక్ష్మీనారాయణశర్మ.

